# రామకథాసుధ

ఆస్మద్గురు సమారంభాం నాథ యామున మధ్యమాం
లక్ష్మీ వల్లభ పర్యంతాం వందే గురు పరంపరాం

రామానుజం గురుం వందే
సీతాంచ చిద్రూపిణీం
శ్రీరామం పరబ్రహ్మం
మారుతిం భక్తాగ్రణీం






మరల నిదేల రామాయణంబన్నచో
ఈప్రపంచకమెల్ల నెల్లవేళల
తినుచున్న అన్నమే తినుచున్నదిన్నాళ్ళు
తన రుచి బ్రతుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నది
తనదైనయనుభూతి తనదిగాన
తలచిన రాముడే తలచెద నేనును
నా భక్తి రచనలు నావి గాన

ఆకాశంలో ఎన్ని నక్షత్రాలు ఉన్నాయో తెలుగు భాషలో అన్ని రామాయణాలు ఉన్నాయన్నారు కొంత మంది పెద్దలు. "మూడు వందల రామాయణాలు" అని ఒక వ్యాసం రాసి సంచలనం సృష్టించాడు ఒక బుద్ధి జీవి. కానీ నా దృష్టికి రెండు రామాయణాలు మాత్రమే కనపడతాయి. రాముడు దేవుడని నమ్మిన వారు రాసినవి, ఆ నమ్మకం లేనివారు రాసినవి. పైన ఉదాహరించిన "మరలనిదేల.." పద్యం రాసిన విశ్వనాథ సత్యనారాయణ గారికి రామకథ ముక్తిని ఇచ్చే కల్పవృక్షం. వారికి రాముడు దేవుడే. మరి అదే రామకథ రంగనాయకమ్మ గారికి రామాయణ విషవృక్షం. హేతువాదుల తర్కాలకు అంతు లేదు. చరిత్ర లోని ఒక వ్యక్తిని తర్వాత తరాల వాళ్ళు దేవుడు అన్నారా? రామాయణం రెండు వర్గాల మధ్య పోరాటమా? అరణ్యవాసులకు వ్యవసాయదారులకు జరిగిన ఘర్షణ యొక్క ఛాయా? ఈ సిద్ధాంత రాద్ధాంతాలు అన్నిటికీ మూలకారణం

ఒకటే. హిందూ ధర్మ, మత, సభ్యతలని క్రైస్తవ మత వికాసం యొక్క మూసలోనో లేకపోతే మార్క్సిస్టు సిద్ధాంత పరిధిలోనో ఇరికించడం. ముఖ్యంగా మార్క్సిస్టు రంగుటద్దాలతో చూసి కుల వ్యవస్థని వర్గపోరాటంగా చిత్రీకరించటం, శైవ వైష్ణవ ఘర్షణలు భూతద్దంలో పరిశీలించి, అవి కేవలం పదకొండవ శతాబ్దంలో మహమ్మదీయులను అనుకరించి చేసిన చెదురుముదురు సంఘటనలు అని ఒప్పుకోకపోవడం బుద్ధి జీవులకు అలవాటు అయ్యింది. వీటికి స్వతంత్ర భారతదేశంలో ప్రభుత్వ సమర్థన చాలా ఎక్కువగా లభించటం వల్లనే, ఆత్మగౌరవానికి దెబ్బతగిలి, ముందూ వెనకా చూడకుండా పూర్వీకులను ఆరాధించడమూ, ఆధునిక విజ్ఞానమంతా తమ మత గ్రంథాలలో నిక్షిప్తమై ఉందనే మూర్ఖత్వమూ హిందువులలో బాగా ప్రబలినవి. వీటిని గురించి ఇదివరకే నా అభిప్రాయం ఇతర రచనలలో వ్యక్తం చేశాను. ఇక్కడ వాటి ప్రసక్తి అనవసరం.

కానీ ఈ ఆధునిక బుద్ధి జీవుల వలలో పడి కొంతమంది రామభక్తుల మంటూనే రామాయణం లోని జాతకాల ఆధారంతో రాముడు నిజంగా పుట్టిన రోజుని గుర్తించే ప్రయత్నం చేస్తున్నారు. దీనికి ప్రతిక్రియ ప్రస్తుత రచనలో అవసరం. రాముడు దేవుడు అనడం నమ్మకం. దానికి రుజువులూ సాక్ష్యాలూ ఉండవచ్చునా? ఉండకూడదని ఇంతకు ముందు నా ఘోష పద్య సంపుటిలో మనవి చేశాను.

రామసేతువు రాళ్లు వెదకంగగాబోరు
రాముడే దేవుడని నమ్మువారు
రుజువులే దొరికిన రాముడు దేవుడు కాదు
వినరులే అన్యులు వినర రామా

మనిషి బుద్ధికి తెలిసేవి రుజువులూ, సాక్ష్యాలూ. రాముని జన్మ గురించి గానీ, సేతు నిర్మాణం గురించి గానీ, రుజువులు ఉన్నాయి అని అనడం రాముడిని బుద్ధితో తెలుసుకోవడమే

అవుతుంది. ఇది హిందూ సాంప్రదాయం దృష్ట్యా అసంభవం, అసంగతం. భర్తృహరి శతకం లోని మొదటి పద్యాన్ని చూడండి.

దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్త మూర్తయే
స్వానుభూత్యేకమానాయ నమ శాన్తాయ తేజసే

దిశా, కాలమూ మొదలైనవాటి కొలతలకు లోబడక, అనంతమై, కేవలం స్వానుభూతితో తెలుసుకోవడమే సాధ్యమైన, ఆ శాంత స్వరూపానికి నమస్కరిస్తున్నాను, అని దీని తాత్పర్యం.

స్పష్టంగా "స్వానుభూత్యేకమానాయ", వ్యక్తిగత అనుభూతికేగానీ, ఇంద్రియాలకో, బుద్ధికో తెలిసేది కాదని అంటారు భర్తృహరి. భగవంతుడు నిజంగా ఉన్నాడా అనే ప్రశ్నకు సమాధానం వెతికే ముందు, నిజం అంటే ఏమిటి, అన్నది తేల్చుకోవాలి. నిజం కంటికి కనపడేదో, స్పర్శకి తెలిసేదో, తార్కికంగా నిలబడేదో, లేక ప్రయోగాలతో రుజువు చేయబడ్డదో అనుకుంటే, భగవంతుడు ఆ విధమైన నిజానికి అతీతుడు. ఇది మన పూర్వాచార్యులందరూ ఏకగ్రీవంగా అంగీకరించినదే.

అలాగే, నా ఘోష లో నేను మనవి చేసిన విధంగా,

భగవంతుని వరములు భువిలోనేనాడు
పరీక్షింతునన్న తెలియబోవు
బుద్ధికి తెలియునది బ్రహ్మముకాదని
వినరులే అన్యులు వినర రామా.

ఈ రుజువులు లేకపోవడం కేవలం భగవంతుని ఉనికి గురించే కాదు, అన్ని భగవద్ విషయాలకూ వర్తిస్తుంది. మన బుద్ధి జీవులు అనవసరంగా అతికి పోయి, భగవంతుణ్ణి డబ్బు కోసమో, లేక ఇతర కోరికలతోనో ప్రార్థించటాన్ని నిరసిస్తారు. కానీ భగవద్గీత లో

చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ

ఆపదలో ఉన్నవారు, జిజ్ఞాసువులు, సంపదలను కోరుకునేవారు, జ్ఞానులు అనబడే నాలుగు రకాల సత్పురుషులు, అనగా మంచి పనులు చేయు మనుష్యులు, నన్ను సేవిస్తున్నారు అంటాడు శ్రీకృష్ణుడు. భగవంతుణ్ణి నమ్మటం ఎంత వరకు ఒప్పో, వరాలు అడగటం, మొక్కులు తీర్చడం అంతే ఒప్పు. మన కోరికలు ఆ భగవంతుడు తీరుస్తాడని నమ్మడం తప్పు కాదు. అటువంటి నమ్మకం లేకపోతే అసలుకే మోసం వస్తుంది. కానీ మన బుద్ధితో పరీక్షించి, భగవంతుని చేతలు తెలుసుకోగలము అనుకోవడం మాత్రం శుద్ధ తప్పు.

ఈ విధమైన పరీక్షలతోనే నిజం ఏదో తెలుస్తుందని ఆస్తికులని సవాలు చేస్తారు నాస్తికులు. ప్రపంచంలో మొట్టమొదటిసారి గుణాంకశాస్త్ర సహసంబంధాలను (స్టాటిస్టికల్ కోరెలేషన్లను) విజ్ఞానశాస్త్రంలో ప్రవేశపెట్టిన ఫ్రాన్సిస్ గాల్టన్, "నౌకా ప్రమాదాలలో ఇతరుల కన్నా తక్కువగా మత ప్రచారకులు మరణిస్తున్నారా?" అన్న ప్రశ్ననే తన మొదటి ఉదాహరణగా తీసుకున్నాడు. లేదనే సమాధానం వచ్చింది. ఒక మాట ఒప్పుకుని తీరాలి. వైజ్ఞానిక పరీక్షలను, నిస్పక్షపాతంగా, నిజాయితీగా, జాగ్రత్తగా చేసినప్పుడు భగవంతుని ఉనికిని గురించి గానీ, ప్రార్థనవల్ల లేదా అటువంటి ఇతర కార్యక్రమాల కారణంగా భౌతిక జీవితంలో లభించే ప్రయోజనాల గురించి గానీ, ఏ విధమైన రుజువులూ, సాక్ష్యాలూ ఏనాడూ ఎవరికీ దొరకలేదు. దొరికాయి అనే వాదన కేవలం తాను పట్టిన కుందేలుకి మూడే కాళ్ళు అని అనడమే.

అసలు వైజ్ఞానిక పద్ధతిలో భగవద్విషయాలు పరీక్షించడం తప్పు. గొప్ప వైజ్ఞానికులు నాస్తికులు కాకపోవచ్చు. కానీ ఈ

విషయంలో వారి మాటలకు ఎక్కువ విలువ ఇవ్వడం ఇంకా పెద్ద తప్పు. వీటన్నింటికీ కారణం ఒకటే. వైజ్ఞానిక మార్గ పరిధిలో అంతర్గతంగా ఎల్లప్పుడూ నాస్తికత్వం ఉంటుంది అని ఒప్పుకోకపోవడం.

విచిత్రంగా ఎంతో కొంత భగవద్విషయంగా చదివి ఉన్నవారు కూడా ఈ విధంగానే పప్పులో కాలు వేస్తూ ఉంటారు. ఆధునిక విజ్ఞాన శాస్త్రం తో పోటీ పడలేక పోయినా, ప్రాచీనకాలంలో కూడా ఆస్తికులకి హేతువాదం ఆధారంగా చేసిన సవాళ్లు లేకపోలేదు. కానీ జగద్గురువులు సైతం ఈ హేతువాదులతో వాగ్యుద్ధం వృధా అని అన్నారు. అందుకే వారి గ్రంథాలలో, భాష్యాలలో ప్రత్యక్ష అనుమానాలకంటే, శృతి అనగా వేద ప్రమాణమే ముఖ్యమని, ముందుగానే నిబంధన చేసేవారు. వారి ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలే నేటి విజ్ఞాన మార్గం. ప్రయోగాల ఫలితాలు ప్రత్యక్ష ప్రమాణమనీ వాటిని గురించిన హేతువాద తర్కమే అనుమాన ప్రమాణమనీ ఏ భాష్య పీఠిక చదివినా తెలుస్తుంది.

గాలిలో దీపం పెట్టి, దేవుడా నీదే భారం అనడం అవివేకం మాత్రమే. గాలిలో దీపం పెట్టి నా భక్తిని పరీక్షిస్తాననటం ఉభయ భ్రష్టత్వం. వైజ్ఞానికంగా బుద్ధి లేని పని. ఆధ్యాత్మికంగా అర్థం లేని పని.

మనసు మీదా శరీరం మీదా నియంత్రణ ఉన్నా లేక పోయినా భౌతిక ప్రకృతి పైన తమకు ఉన్న శక్తిని ప్రదర్శిస్తామనే వారి వెనుక పరిగెత్తే ముందు ఒక్క విషయం గుర్తుంచుకోవాలి.

సమీప చరిత్ర లోని మహనీయులు, త్యాగరాజస్వామి, రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి ఈ విధమైన ప్రదర్శనలు చేసినట్లు వారి సమకాలస్తులెవ్వరూ చెప్పలేదు. కాని వారి తరువాత ఈ కొద్దికాలం లోనే చాలా మహిమలూ మహత్యాలూ ప్రచారం లోకి వచ్చాయి. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు వేమన గురించి

తమ ఉపన్యాసాలలో ఒక చమత్కార బాణం వదిలారు. కొందరు ఆధునిక చరిత్రకారులు బసవేశ్వరుడు ఆంధ్రుడని చెప్తారు. ఈ అబద్ధం కన్నా, భీముడు ఏకాదశి రోజున ఫలహారంగా బండెడు పనస పళ్ళు తిన్నాడు అన్న పురాణ కథలోని అతిశయోక్తి లో సొగసు ఎక్కువ అన్నారు. అదేవిధంగా భౌతిక ప్రపంచం పైన ఈ మహనీయులు తమ ఆధ్యాత్మిక శక్తిని చూపగలరని చెప్పడం కూడా భక్తులు సృష్టించిన సొగసేనా?

ఈ విధంగా రాముడి గురించి సమాజశాస్త్ర శోధనా, దైవకృపకు రుజువులు వెదకటమూ, ఆధ్యాత్మికతకు పూర్తిగా విరుద్ధమనీ, మహనీయుల మహత్యాలు బహుశా భక్తుల అతిశయోక్తులేననీ అనటం, దేవుడిని నమ్మే ఆధునికులలో కూడా చాలా మందికి నచ్చదు. దైవత్వానికి విజ్ఞానమంతా ఆధీనం కాకపోతే దైవత్వానికి విలువ మిగలదనుకుంటారు చాలా మంది. కానీ ఇవేవీ లేకుండా దైవత్వం మీద శ్రద్ధ కుదిరే మార్గం ఉంది

తర్కోఽప్రతిష్ఠః శ్రుతయో విభిన్నాః
నైకో ఋషిర్యస్య మతం ప్రమాణమ్
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గతః స పన్థాః

తర్కానికి గొప్పతనం ఏమీ లేదు. సాంప్రదాయ భావం ఇదే అని ఇంతకు ముందు కూడా తెలిపాను. వేద ప్రామాణ్యాలు, ఋషి మతాలు పరస్పరం కలహిస్తాయి. ఒక్క మాటలో చెప్పాలంటే మహాజనుల ప్రవర్తన మాత్రమే ధర్మ మార్గాన్ని చూపిస్తుంది. ఇది మహాభారతం లో యక్ష యుధిష్ఠిర సంవాదంలో ధర్మానికి ఇచ్చిన నిర్వచనం. దీనికి ఆధారం తైత్తిరీయ ఉపనిషత్తు లోని శిక్షావల్లి.

యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్ ॥ 3॥
యే తత్ర బ్రాహ్మణాః సంమర్శినః । యుక్తా ఆయుక్తాః ।

అలూక్షా ధర్మకామాః స్యుః । యథా తే తత్ర వర్తేరన్ ।
తథా తత్ర వర్తేథాః ।

నీకు ఏ విషయంలోనైనా ఏం చేయాలో తెలియనప్పుడు, చక్కటి ఆచరణ గల ఒక బ్రాహ్మణుని గుర్తించి, వారు ఈ పరిస్థితిలో ఏం చేస్తున్నారో గమనించి, అదే ధర్మంగా భావించు అని ఈ సూక్తి తత్పర్యం.

ఈ మహాజనులని గుర్తించడం తేలికేమీ కాదు.

మహాజనులు నడచు మార్గమే ధర్మమని
చెప్పిరి తైత్తిరీయ భారతాదులలో
మహాజనుల గుర్తించు మార్గమూ సాధనే
వినరులే అన్యులు వినర రామా

ఈ సాంప్రదాయాన్ని అనుసరించి పరమ భాగవతుల జీవితాలే ధర్మ మార్గమని నమ్మటం, ఆధునిక వైజ్ఞానిక పద్ధతుల పైన గౌరవంతో, వాటిని దైవ సంబంధమైన విషయాల లోకి లాక్కుని రావడం కంటే మేలు. త్యాగరాజస్వామి శ్రీరాముడు దేవుడని చెప్పడం మనం నమ్మడానికి చాలకపోతే, ఏదీ చాలదు.

యే యథా మాం ప్రపద్యంతే  తాంస్తథైవ భజామ్యహమ్
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్ధ సర్వశః

నన్ను ఏ విధంగా మనుషులు భావించి సేవించితే వారికి ఆ విధంగానే నేను ప్రతిస్పందిస్తాను. అర్జునా, తెలిసి చేసినా తెలియకుండా చేసినా, అందరూ నా మార్గాన్నే అనుసరిస్తూ ఉంటారు అంటాడు శ్రీకృష్ణుడు ఈ భగవద్గీత శ్లోకంలో. హిందూ సంస్కృతిని అర్థం చేసుకోవడానికి ఈ శ్లోకం చాలా ముఖ్యం. మన సాంప్రదాయంలో, ఆదినించీ, ప్రతి వ్యక్తికీ, తనకు అనువైన, నచ్చిన మోక్షమార్గాన్ని ఎన్నుకోవటానికి ఏ విధమైన

అడ్డంకులూ లేవు. సామాజిక ప్రవర్తనలో, వేషధారణలో, వ్యక్తికి ఏమాత్రమూ స్వేచ్ఛ ఇవ్వని మన హిందూ సంస్కృతి, భగవద్విషయంలో మాత్రం ఇలా పూర్తి స్వాతంత్ర్యం ఇవ్వడం, స్వామి వివేకానంద అన్నట్టు, గొప్ప విచిత్రమే.

మన సాంప్రదాయంలో కేవలం మూడు కోట్ల దేవతలే కాదు, లెక్కించలేనన్ని ఆరాధనా పద్ధతులూ ఉన్నాయి. భగవంతుని స్వరూప వర్ణనలో గానీ, భక్తుల చరిత్ర వర్ణనలో గానీ, ఏ విధమైన అవధులు లేవు. భారత ఉపఖండంలో తప్ప మరి ఇంకెక్కడా కనపడని ఈ ఇష్టదేవతను ఎన్నుకునే స్వతంత్రం, ఎప్పుడు ఎలా ఎందుకు మొదలు అయిందో ఏ చరిత్రకారుడికీ తెలియదు. కానీ భగవద్గీత లో ఉన్న యజ్ఞ, యోగ, సన్యాస, భక్తి మార్గాల సమన్వయానికీ, నేటి మన ఆచరణకూ, ఏ విధమైన తేడా లేదు. అందుకే, ఏదైనా ప్రాచీన గ్రంథంలో రాముని ప్రసక్తి లేకపోతే, నాటికి రాముడు దేవుడు కాదని రాద్ధాంత సిద్ధాంతాలు చేయడం కంటే, ఆ గ్రంథాన్ని అనుసరించిన వారికి రాముడు ఇష్టదైవం కాదనుకోవడం న్యాయం. ఇలా ఆలోచించే వాళ్ళకి ఆ గ్రంధాలలో మాటలకు, వ్యాకరణ సూత్రాలని ఆధారం చేసుకుని కొత్త అర్థాలు వెతికి, రాముని ప్రసక్తి ఉంది అని వాదించే శ్రమ తగ్గుతుంది.

మన పౌరాణిక గ్రంథాలలోని కొన్ని కొన్ని వర్ణనలు, ప్రవర్తనలు నేటి సమాజంలో చాలా అమానవీయంగా, అసహ్యంగా, అసభ్యంగా కనపడతాయి. ఇలాంటివి రామయణంలో ఉండటమే ముందర ఉదాహరించిన “రామాయణ విషవృక్షం" లాంటి రచనలకు కారణం. ఇంకా దారుణమైన కొన్ని కొన్ని పూజలనీ, సాధనలనీ క్షుద్రపూజలని మన పూర్వీకులే బహిష్కరించారు. పురాణాలలో ఇవి చోటు చేసుకోవడానికి కూడా ముందు నెను మనవి చేసిన స్వతంత్రమే కారణం. సాంప్రదాయం లోని మంచిచెడులను విడదీయడానికి మనకు మళ్ళీ మహాజనుల ఆదర్శమే గతి.

ఈ మార్గాన్ని అంగీకరించి, ఇక్కడనుంచీ రామకథ గురించి కొన్ని సొగసులను చూపే ప్రయత్నం చేస్తున్నాను.

ఎవరైనా భగవంతుణ్ణి సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు అని నమ్మి ఆరాధిస్తారు. కొన్నిసార్లు భగవంతుని రూపం సౌమ్యంగా కాక భీకరంగా ఉండవచ్చు. కాళీ స్వరూపం ఒక ఉదాహరణ. వీరభద్ర రూపంలో శివుడిని, నారసింహ అవతారంలో విష్ణువు నీ, భీకరమైన రూపంలోనే పూజిస్తారు. కానీ ఆ రూపం సౌమ్యమైనా భీకరమైనా, శక్తీ సామర్థ్యమూ క్షమతా, అపారమే. ఇష్టదైవం శివుడు అయినా, మహంకాళి అయినా, కృష్ణుడైనా, మరెవరైనా దీనిలో తేడా రాదు. శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తాడు. శివుడు హాలాహల విషం తాగాడు. శివుడు భక్త మార్కండేయుడిని యముడి బారి నుంచి కాపాడాడు. కృష్ణుడు పరీక్షిత్తుని మళ్ళీ బ్రతికించాడు. భక్తులు తమ ఇష్టదేవతను ప్రార్థిస్తారు. కోరిన వరాలు ఇవ్వకపోతే మళ్ళీ బతిమాలుకుంటారు. అప్పుడప్పుడు తిట్టనూ తిట్టవచ్చు.

పరమభక్తులు కూరత్తాళ్వారు రాముడిని ఉద్దేశించి ఈ పద్యం రాశారు.

పృచ్ఛామి కిఞ్చన యదా కిల రాఘవత్వే
మాయామృగస్య వశగో మనుజత్వమౌఢ్యాత్
సీతావియోగవివశో న చ తద్గతిజ్ఞః
ప్రాదాస్తదా పరగతిం హి కథం ఖగాయ

స్వామీ ఒక మూఢ మానవుడి లాగా బంగారు లేడి వెనుక పరిగెత్తి, సీతమ్మ కనపడకపోతే, ఎక్కడున్నదో తెలియదంటూ దుఃఖంతో వివశుడవై ఉన్న వాడివి, ఆ మరుక్షణంలోనే నువ్వు జటాయువుకి మోక్షమివ్వడమేమిటి? ఇది మాయా? లీలా? అని దీని భావం.

ఈ విధంగా, ఇంకే దేవుణ్ణి గురించీ, ఏ భక్తుడూ, ఏనాడూ అనే అవకాశం లేదు. ఇదే రామ కథ లోని విశిష్టత.

విగ్రహారాధన నచ్చని వేమన గారు కూడా ఇదే ప్రశ్న లేవదీశారు. కానీ జటాయువు విషయం దాటవేశారు.

కనకమృగము భువిని గద్దు లేదనకయె
తరుణి విడిచి చనియె దాశరథియు
తెలివిలేని వాడు దేవుడెట్లాయెరా?
విశ్వదాభిరామ వినురవేమ!

ఇంతకుముందు ఉదాహరించిన కూరత్తాళ్వారుగారి పద్యం వారి అతిమానుష స్తవం లోనిది. భగవంతుని లీలలు మనం ఎప్పటికీ అర్థం చేసుకోలేమంటూ దానిలో అనేక విచిత్రాలు పేర్కొని, ఈ వింత లేమిటి స్వామీ అని ఆ భగవంతుణ్ణే వారు ప్రశ్నిస్తారు. ఉదాహరణకు, సకల సృష్టినీ మూడు అడుగులలో కొలువగల నీకు ఆ మూడు అడుగులూ మాత్రం బలిని భిక్షగా అడగవలసి వచ్చిందా? ఎవరైనా తనకంటే ఎక్కువ శక్తి గల వారిని సహాయం అడుగుతారు. నీకంటే ఎంతో తక్కువ శక్తి కలవాడు సుగ్రీవుడు. మరి నువ్వు వాడిని సహాయం అడగటమేమిటి? బాణాసురుడితో యుద్ధంలో నీ చేతిలో ఓడిన శివుడి గురించి తపస్సు చేసి సంతానం వరంగా ఇవ్వమని ప్రార్థించటమేమిటి? ఇటువంటి ప్రశ్నలకు సమాధానాలు మానవుడు తన మేధస్సుతో ఎప్పుడూ తెలుసుకో లేడంటూ చివరకు

యత్ త్వత్ప్రియం తదిహ పుణ్యం అపుణ్యమన్యత్
నాన్యత్ తయోర్భవతి లక్షణమన్య జాతుః

నీకు ఇష్టమైనది పుణ్యం.నీకు ఇష్టం లేనిది పుణ్యం కాదు. నువ్వు ధర్మమంటే అది ధర్మం, కాదంటే కాదు. వీటికి ఇంకొక పరిభాష లేదు అని తెలిపారు.

కూరత్తాళ్వారు భగవద్రామానుజుల శిష్యులు. రామాయణంలో భగవద్రామానుజులకి సందేహాలు కలిగితే తిరుమల నంబి ప్రతి దినమూ తిరుపతి కొండ దిగివచ్చి అలిపిరిలో రామాయణం వ్యాఖ్యానం చేసారని శ్రీవైష్ణవ సంప్రదాయం. వారేమడిగారో వీరు ఏమి చెప్పారో గ్రంథస్థం అయినట్టు లేదు. కానీ అతి మానుష స్తవం లో ఆ వ్యాఖ్యానం లోని కొన్ని భావాలు ఉన్నాయేమో.

"మనుజత్వమౌగ్ధ్యాత్" అనడం చాలా గొప్ప సంగతి. చాలాసార్లు ఒక సాధారణ మానవుని కన్నా ఎక్కువగా అధైర్యం, అబలత్వం ప్రదర్శించిన రాముడు, ఆ తర్వాత దేవదేవుడే అయిపోయాడు అన్నాడో బుద్ధిజీవి. వాళ్ళు  అనుకున్నట్టు మొదట్లో రామ కథ ఒక రాజు చరిత్రో, వీరగాథో కాదనటానికి, ఆ ఒక్క మాటే చాలు. నాయకుడికి ఇటువంటి లోట్లు ఉన్నట్టు అలాంటి రచనలలో ఎప్పుడూ చెప్పరు. ఒకవేళ నిజజీవితంలో లోట్లు ఉన్నా, రచనలో కప్పి పెడతారు కానీ వాటిని ప్రస్ఫుటంగా ఎప్పుడూ వెల్లడి చెయ్యరు.

రావణ వధ కోసం మహావిష్ణువు మనిషిగా అవతారం దాల్చాడన్న పురాణ కథను సమర్ధిస్తాయి ఈ వర్ణనలు. మానవుడన్న తరువాత కొన్ని లోట్లు ఉంటూనే ఉంటాయి. కనుక ఈ విధమైన వర్ణన వల్ల వచ్చే లోపం ఏమీ లేదు. వేమన గారికి ఈ విధంగా సమాధానం చెప్పవచ్చు. మనిషికి విజయం సాధించటానికి తెలివి కావాలి. దేవుడికి అనవసరం.

ఈ విధంగా భగవంతుని అవతారం ఒక్కొక్కసారి ఒక సాధారణ మానవుడి లాగా, మళ్ళీ మాట్లాడితే ఒక బలహీన మానవుడి లాగా ఉండవచ్చు అనటం రామాయణం లోని ఒక సొగసు.

ఈ విధమైన కొన్ని కొన్ని మినహాయింపులు ఉన్నా, రాముడిని అన్ని రామాయణాల లోనూ ఒక పురుషోత్తముడు గానే వర్ణిస్తారు. సృష్టిలో అత్యుత్తమ గుణాలు కలవాడు ఎవరు అని వాల్మీకి

నారదుని అడగటంతో వాల్మీకి రామాయణం మొదలవుతుంది. వాల్మీకి ఒక పదహారు సద్గుణాలు ఏకరువు పెట్టే, అవి అన్నీ రాముడిలో ఒప్పారినవంటూ నారదుడు పూర్తి రామాయణ కథని సంక్షిప్తంగా చెప్తాడు. నారదుడు కూడా రాముడి గుణాలని ఏకరువు పెట్టాడు కానీ, ఆ వర్ణనల కంటే ఈ భర్తృహరి సుభాషితం రాముడి గొప్పతనానికి అద్దం పడుతోంది.

వాంఛా సజ్జన సంగతౌ పరగుణే ప్రీతిః గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతి ర్లోకాపవాదాద్భయం
భక్తిశ్శూలిని శక్తిరాత్మ దమనే సంసర్గ ముక్తిః ఖలైః
ఏతే ఏషు వసంతి నిర్మల గుణాః తేభ్యాం నమః కుర్మహే

సజ్జనులతో సహవాసం చేయాలనే కోరిక, ఇతరుల మంచి గుణముల పట్ల ప్రీతి, పెద్దల పట్ల నమ్రత, విద్యలో మితిలేని ఆసక్తి, సొంత భార్యకు మాత్రం పరిమితమైన శృంగారము, లోకాపవాదం పట్ల భయము, శివభక్తి, మనసును నిలుపుకొనే శక్తి, దుష్టులకు దూరంగా ఉండటం అనే సద్గుణాలు కలిగిన సత్పురుషులకు  నమస్కరిస్తున్నాను అంటున్నారు భర్తృహరి.

ఈ మంచి గుణాలన్నీ ఉన్నవారు దొరకటం దాదాపు అసంభవం. పురాణాలలోని వర్ణనలను  పరిశీలిస్తే రాముడు ఒక్కడే తగిన ఉదాహరణగా కనపడతాడు. పురాణాలలో చాలామంది గొప్ప వీరులూ గురువులూ జ్ఞానులూ కనపడతారు. కానీ వారందరూ పర స్త్రీలతో తిరిగే దక్షిణ నాయకులు. లేదా దుష్టుల సహవాసం ఒదలనివారు, కాకపోతే అసూయాపరులు. ఈ గుణాల జాబితాలో చేర్చబడ్డ లోకాపవాదుకు భయపడటం అనేది ఆధునికులలో చాలా మందికి నచ్చదు. కానీ పురాతన కాలం లోనే కాదు, నేడు కూడా ఒక గొప్ప మనిషి ప్రవర్తన అనుమానానికి చోటు ఇవ్వకూడదని భావించడం సమంజసం అని చాలామంది అంటారు. రాముడు కేవలం ఆదర్శ మానవుడేనంటే భర్తృహరి నిర్వచనం ప్రకారం లోకనిందకు భయపడటం లోపం కాదు.

రామో విగ్రహవాన్ ధర్మః, రాముడు మూర్తీభవించిన ధర్మము అని అన్నారు. ధర్మం గురించి ఆలోచించే ముందు రాముడిని ఆదినుంచీ భగవంతుని అవతారం గానే భావించారు అన్న విషయం గురించి ఇంకా కొన్ని వివరాలు తెలుసుకోవాలి.

రాముడు మర్యాదా పురుషోత్తముడు అంటే పురుషులలో ఉత్తముడని కాక పురుషులందరికీ ఉత్తముడని అర్థం. మర్యాదలు పాటించి ఒక ఆదర్శంగా నిలబడటం ఒక లీల.

"పృచ్ఛామి కించిన.." అని పైన పేర్కొన్న పద్యం ఇంకొక కారణం వల్ల కూడా చాలా చాలా ముఖ్యం. రామాయణంలో రాముడు స్వయంగా తన దైవత్వాన్ని ప్రదర్శించినది రెండే రెండు సార్లు. జటాయువుకు అగ్ని సంస్కారం చేసి నా అనుజ్ఞతో నీకు ముక్తి కలుగుతుంది అనడం మొట్ట మొదటిది. ఇది విచిత్రమైన మాట. ఎనభై నాలుగు లక్షల జీవరాశులలో కేవలం_మానవుడు మాత్రమే ముక్తి సాధించగలడని అనేక మాట్లు చెప్పబడుతుంది. మరి జటాయువు పక్షి. ముక్తి మార్గాలు ఆచరించలేని జీవం. కానీ రాముడు నేనే అగ్ని సంస్కారం చేస్తున్నాను, "నా అనుమతితో" (ఇతర దేవతల అనుమతి అవసరమైనా లేకుండా) అన్నిటికీ ఉత్తమమైన లోకానికి (మోక్షానికి) వెళ్ళమని చెప్పాడు.

మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకాన్ అనుత్తమమ్
గృధ్ర రాజ మహా సత్త్వ సంస్కృతః చ మయా వ్రజ

మళ్ళీ రాముడు ఇటువంటి మాట అన్నది విభీషణ శరణాగతి సమయంలో.

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ

ఒక్కసారి నేను నీ వాడను అని నన్ను శరణుజొచ్చిన వాళ్ళకి అభయం ఇవ్వడం నా యొక్క వ్రతం అంటూ రాముడు ఇక్కడ "సర్వభూతేభ్యో", మానవులకే కాదు, అన్ని జీవరాశులకీ అనడం ప్రస్ఫుటంగా తన దైవత్వాన్ని ప్రకటించటమే అవుతుంది.

ఇంకొకసారి రాముని దైవత్వాన్ని హనుమంతుడు రావణాసురుడి సభలో సూచిస్తాడు. రాముడు మూడు లోకాలనూ, జీవరాశులతో సహా, నాశనం చేసి మళ్ళీ సృష్టించగలడు అంటూ.

సర్వాన్ లోకాన్ సుసంహృత్య  సభూతాన్ సచరాచరాన్
పునరేవ తథా స్రష్టుమ్ శక్తో రామో మహాయశాః

మూడు లోకాలనూ నాశనం చేయగలడు అనడం అతిశయోక్తిగా ఎవ్వరి గురించైనా చెప్పవచ్చు. కానీ మళ్ళీ సృష్టి చేయగలడు అని అతిశయోక్తిగా ఎవరూ అనరు. అది రాముడి దైవత్వానికి సూచనే.

వాల్మీకి రామాయణంలో ఇంకా చాలా చోట్ల రాముడు విష్ణువు అవతారమని కీర్తించటం మనకు కనపడుతూ ఉంటుంది. విశ్వామిత్రుడూ, జనకుని పురోహితుడు శతానందుడూ, రావణుడి పట్టపు రాణి మండోదరీ మొదలైన అనేకమంది రామయణంలో సూచనగానో సూటిగానో ఈ విషయం గుర్తు చేస్తూనే ఉంటారు. ఇవన్నీ ఆ తరువాత కాలంలో చేర్చబడిన ప్రక్షిప్తాలు అని వాటిని అన్నిటినీ తొలిగిస్తే, "కట్టే-కొట్టే-తెచ్చే" అని మూడు మాటల రామాయణమే మిగులుతుంది. ఆధ్యాత్మరామాయణం, తులసీ రామాయణము వంటి గ్రంథాలలో రాముడి దైవత్వం వాల్మీకి రామాయణం కంటే చాల ప్రస్ఫుటంగా కనపడుతుంది. మొట్టమొదట రాముడిని దేవుడుగా భావించింది ఎవరు? వాల్మీకి రామాయణం రాసే ముందు రామ కథ పురాణాలలో ఉండేదా? ఇలాంటి ప్రశ్నలకి ఆధ్యాత్మికంగా అర్థం లేనే లేదు. మన సమీపకాలంలోని మహా భక్తుడు త్యాగరాజస్వామి కీర్తనలలో, నేటి

ఏ ప్రసిద్ధ రామాయణంలోనూ కనపడని కొన్ని కొన్ని వర్ణనలూ, సంఘటనలూ కనపడతాయి. ఒక కృతిలో చంద్రుడి అంశతో ఒక వానర వీరుడు జన్మించినట్టు రాశారు. ఇంకొకచోట ఈ లంకారాజ్యం విభీషణుడికి ఇస్తానని వాగ్దానం చేసాను కనక, ఇప్పుడు రావణుడు శరణంటే, వాడికి అయోధ్యనే ఇచ్చేస్తానన్నాడు రాముడు అని రాశారు. తెలుగు సాహిత్యంలో ప్రముఖంగా కనపడే ఉడత భక్తి ప్రసక్తి వాల్మీకి రామాయణంలో లేదు. శ్రీవైష్ణవుల పవిత్ర గ్రంధమైన నాలాయర దివ్య ప్రబంధం లో ఉడత కథ ఉంది. శబరి రాముడికి పళ్ళు పండాయో లేదో అని ముందుగా తను రుచి చూసి, ఎంగిలి పళ్లు పెట్టిందన్న కథా వాల్మీకి రామాయణంలో లేదు. కానీ ఇటువంటి భావాలన్నిటికీ ప్రేరణా స్ఫూర్తి వాల్మీకి రామాయణమే.

ఈ శ్లోకంతో రామాయణ రచన ఆరంభం అయింది అని చెబుతారు

మానిషాద ప్రతిష్ఠాం త్వమ్ అగమ: శాశ్వతీస్సమా:
యత్ క్రౌంచమిధునాదేకమ్ అవధీ: కామ మోహితమ్

అన్యోన్యంగా ఉన్న క్రౌంచ పక్షుల జంటలో ఒకదానిని చంపిన ఓ బోయవాడా, నీకు ఎప్పటికీ మోక్షము లభించుకుండుగాక, అని దీని తాత్పర్యం.

ఇక్కడ బోయవాడు క్రౌంచ పక్షుల జంటలో ఒకదాన్ని బాణంతో కొట్టి చంపడం కథ భాగం. వాల్మీకి దానికి స్పందించి వాడిని శపించడం ద్వారా తన భావాన్ని పాఠకులతో పంచుకోవటం కావ్య భాగం. ఇది మౌళికమైన మార్పు. ఈ మార్పే రామాయణం ఆదికావ్యమూ, వాల్మీకి ఆదికవీ అవటానికి కారణం. ఈ శ్లోకంతో ఒక అనూహ్యమైన మార్పు సృష్టించానని ఆదికవికి తెలుసు. అందుకే ఈ శ్లోకం గురించి పదే పదే ఆలోచించి

శోకార్తేనాస్య శకునే  కిమిదం వ్యాహృతం మయా

పాదభద్ధో అక్షరః సమః తంత్రీలయ సమన్వితః
శోకార్తస్య ప్రవృత్తోమే శ్లోకోభవతు నాన్యథా

ఈ పక్షి శోకాన్ని వినటమూ, చూడటమూ వలన  నేను ఎందుకు దుఃఖించి ఈ విధంగా పలికాను? నే పలికిన మాటలు సమమైన అక్షరాలు కలిగి, లయతో పాటగా పాడటానికి వీలుగా వుండి, నా శోకమూ మనో దుఃఖమూ వెల్లడించి, శ్లోకం అన తగినదిగా ఉన్నది  అంటారు వాల్మీకి.

ఈ కొద్ది మాటలతో కావ్య లక్షణం పూర్తిగా స్పష్టం అవుతోంది. కథా సంఘటనల కంటే వ్యక్తుల భావాలూ ఆలోచనలూ పాఠకులపై చాలా ఎక్కువ ప్రభావం చూపిస్తాయి. సంగీతం దానితో కలిస్తే మనసు మీద మరింత ప్రభావం ఉంటుంది. పురాణాలలో ప్రధానం కథ. కావ్యంలో భావం. అందుకే వాల్మీకిని రామాయణం రాయమని ప్రోత్సాహించడం కోసం విచ్చేసిన బ్రహ్మ, జరిగిన రామ కథ లోని విశేషాలే కాక, రహస్యాలు, ఆయా వ్యక్తులు మనసులో అనుకున్నవన్నీ నీకు తెలుస్తాయి, అని వరమిస్తాడు.

వాల్మీకి రామాయణం పూర్తిగా భావ ప్రధానం కాదు. కాకపోయినా పునాది లేక భవన నిర్మాణం అసంభవం. ఆదికవి ఆ పునాది వేసిన వాల్మీకే గానీ, సాక్షాత్తు విష్ణువు అవతారం అని కీర్తింపబడ్డ వ్యాసుడు కాదు.

తెలుగు వారికి పురాణానికీ కావ్యానికీ కల తేడాని స్పష్టం చేసారు బమ్మెర పోతన. సంస్కృత భాగవతం పురాణం. తెలుగులో పోతన భాగవతం పురాణమని పిలవబడుతున్నా అది కావ్యం. గజేంద్రుణ్ణి కాపాడటానికి విష్ణువు రావడం కథా భాగం. విష్ణువు ఆ భక్తుణ్ణి రక్షించే ఆతురతతో జుట్టు కూడా సరిచూసుకోకుండా చేతిలో ఉన్న అమ్మవారి ఉత్తరీయం వదలకుండా,  వాహనమైన

గరుత్మంతుని పిలవకుండా, ఆయుధాలను తీసుకోకుండా బయలుదేరాడు అని చెప్పి, పాఠకుడికి భక్తి పారవశ్యం కలిగించడం కావ్య లక్షణం. చూడండి ఆ పద్యం.

సిరికిం జెప్పఁడు; శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపఁ; డే
పరివారంబునుఁ జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు; వివాద ప్రోత్థిత శ్రీ కుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై

"మానిషాద ప్రతిష్ఠాం త్వమ్...", కావ్యంలో భావం ప్రకటించటానికి అంకురార్పణ. "సిరికిం జెప్పఁడు.." పద్యం ఒక పరాకాష్ఠ. సన్యాస, మంత్ర, తంత్ర, యజ్ఞ, కర్మాది మార్గాలలో భావాత్మతకు ఏమీ ప్రాధాన్యత లేదు. కానీ భక్తికి అది జీవకఱ్ఱ. ఇక్కడే నానృషి కురుతే కావ్యం, ఋషి కానివాడు కావ్య సృష్టి చేయలేడనే ఆర్యోక్తిని గుర్తు పెట్టుకోవాలి. కావ్యం రాసిన ప్రతి వ్యక్తీ ఋషి కాడు, కాలేడు. ఋషితుల్యుడైన వారి ఆచరణ ఇతరులకు ఆదర్శంగా నిలబడుతుంది. వారి యొక్క మహాజనత్వమే వారి కావ్యాలలో ఉన్న భావాలపై సాధారణ మానవులకు గౌరవం పెంపొందిస్తుంది. వారి భావాలూ వర్ణనలూ అంతకు ముందు వారిలో కనపడకపోతే ఆస్తికుడు దానిని వారి అలౌకిక అనుభూతి అని గౌరవిస్తాడు. దీనికీ ఆధారం మళ్ళీ మహాజనత్వం మీద నమ్మకమే. నాస్తికులు ఇదేదో సొంత కవిత్వమని నిరాదరిస్తారు.

వాల్మీకి అంకురార్పణ భక్తికే పరిమితం కాదు. బహుశా ప్రపంచ రచనా చరిత్రలోనే ఇది ఒక మౌలికమైన మార్పు. కానీ సాహిత్య చరిత్ర ఇక్కడ అప్రస్తుతం. రామాయణం లో రాముడి దైవత్వం, పైన చూపిన విధంగా, వెదికి సూక్ష్మంగా పరిశీలించితేనే కనబడుతుంది. అందుకే రాముని దైవత్వం సూచించని రామాయణ రచన తేలిక. పూర్తి నాస్తికులని అటుంచి, భవభూతి వంటి మహాకవి, ఉత్తర రామచరితం లో విషాదానికి పెద్ద పీట వేశారు. మన సాంప్రదాయంలో విషాదం ధర్మ సంకటం

లోనుంచి జనిస్తుంది. రాముడి రాజ ధర్మానికీ పతి ధర్మానికీ సంఘర్షణ వల్ల విషాదం ఉత్పన్నమయింది. పాశ్చాత్య సభ్యత లో ఈ సొగసు లేదు. మృత్యువుతో కథాంతమైతే చాలు. విషాదం విషయం అటుంచి భవభూతి గ్రంథంలో రాముడు దేవుడు కాదు. కేవలం ఒక ఆదర్శవంతుడైన రాజు. ఉదాత్త పురుషుడు. రాముడిని ఇదే విధంగా వర్ణించిన ఇతర పురాతన గ్రంథాలు కూడా ఉన్నాయి. త్యాగరాజస్వామి రాముని దైవత్వం తెలియటం తేలిక కాదంటూ,

పరమ శాంభవాగ్రేశ్వరుండనుచు
వెలుగు రావణుండు తెలియలేక పోయె

అన్నారు. కావ్య దృష్టిలో ఇది అందంగా ఉంది కానీ రావణుడు తెలుసుకో దలచుకోలేదు అనడం కూడా న్యాయమే.

రామ కథ లోని విశిష్టత గుర్తించటానికి కృష్ణావతారం తో పోల్చి చూడడం ఉపయోగకరం. తన దైవత్వం వెల్లడి చేయటంలో రామావతారం ఒక ధృవమైతే కృష్ణావతారం ఇంకో ధృవం. కృష్ణుడు లెక్కించలేనన్ని సార్లు తనే దేవుణ్ణని నిదర్శనాలు చూపిస్తాడు. అసలు జన్మమే చతుర్భుజాలతో. యశోదకు నోటిలో సకల సృష్టి చూపితే, బృందావన ప్రజలకు గోవర్ధన పర్వతం ఎత్తి చూపాడు. ద్రౌపదిని కాపాడినప్పుడు చీరలివ్వడమే కనపడితే అదే సభలో రాయబారమప్పుడు విరాట్స్వరూపం పుట్టుకతో గుడ్డివాడైన ధృతరాష్ట్రుడికి చూపించాడు. కానీ ఈ రెండు దృష్టాంతాలూ అటు ధృతరాష్ట్రుడికీ చాలలేదు, ఇటు దుర్యోధనుడికీ చాలలేదు. మరి అందుకే కురుక్షేత్ర యుద్ధానికి తయారయ్యారు. రాముడు మహిమలు చూపించినంత మాత్రాన రావణుడు రామదాసు అయ్యేవాడా?

రావణ దుర్యోధనులను అర్థం చేసుకోటానికి భగవద్గీత లోని ఈ శ్లోకం సహాయం చేస్తుంది.

అసత్యమప్రతిష్టం తే జగదాహురనీశ్వరం
అపరస్పర సంభూతం కి మన్యత్ కామ హైతుకం

అసుర ప్రవృత్తి గలవారు జగత్తుకు ఈశ్వరుడే లేడనీ, కేవలం స్త్రీ-పురుష పరస్పర కామం వల్ల ఈ జగత్తు సృష్టించబడిందనీ కావున అసత్యమనీ, స్థిరమైన ధర్మమేమీ లేదనీ చెబుతున్నారు.

ఇక్కడ ఈశ్వరుడు లేదనటం చాలా ముఖ్యం. ఈశ్వరుడే లేడని నమ్మేవారు కనుకనే రావణ దుర్యోధనులు రామకృష్ణులను సర్వశక్తిమంతులనీ, వాళ్ళతో యుద్ధం గెలవలేమనీ, చిట్టచివరికి కూడా ఒప్పుకోలేదు.

రావణుడికి బ్రహ్మ గురించి తపస్సూ, శివ భక్తి తన యొక్క క్షమత పెంచుకోవడానికి మార్గాలు మాత్రమే. తను తపస్సు చేశాడు. కాబట్టి అడిగిన వరమివ్వడం బ్రహ్మకి తప్పదు. శివ పూజ చేశాడు కాబట్టి కోరింది ప్రసాదించడం ఆ శివుడికీ తప్పదు. ఇది పూర్తిగా స్వశక్తి మీద విశ్వాసం.

తమ కోరికలు తీర్చమని భగవంతుని వేడుకునేవాళ్ళు దీనికి పూర్తిగా వ్యతిరేకం. కోరిక తీరితే అది భగవంతుని కృప మాత్రమే. తమ శక్తి కాదు. కోరిక ముక్తియైనా ధనమైనా దీనిలో తేడా రాదు. ఒక ప్రత్యేక పూజో యజ్ఞమో చేస్తే, ఒక ప్రత్యేకమైన ఫలితం లభిస్తుంది అని నమ్మే వారిలో కూడా, ఇంచుమించు అందరూ ఈశ్వరుడు సర్వశక్తిమంతుడనీ, తమ ప్రయత్నాలకి ఈశ్వర అనుగ్రహం కూడా కావాలనీ, ఒప్పుకుంటారు. భగవత్ గీతలో, యజ్ఞ, కర్మ, యోగ మార్గాలని ఈశ్వరుడి మీద విశ్వాసంతో సమన్వయం చేసారు. భాగవతంలో సాంఖ్యం ఉపదేశించిన కపిలుడు విష్ణువు అవతారమన్నారు. రాముడు దేవుడు కాదని రామ కథ రాయడం ఎంత తేలికో, యజ్ఞాలూ, సాంఖ్య, యోగ, సాధనలూ, నిరీశ్వర మార్గాలని వాదించటం అంతకన్నా తేలిక. ఈశ్వరుడు ఉన్నాడని ఒప్పుకోని వాళ్ళని, మన పూర్వీకులు

చార్వాకులనీ పాషాండులనీ చెడ తిట్టేవాళ్ళు కానీ వాళ్ళని చంపమనటం ఏనాడూ మన సాంప్రదాయం కాదు.

ఈశ్వరుడంటేనే సర్వశక్తిమంతుడైన పరబ్రహ్మ స్వరూపమని భగవద్గీత లోని ఈ శ్లోకం స్పష్టం చేస్తుంది.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మ మాయయా

జన్మ మృత్యువు లేక, జీవులందరికీ ఈశ్వరుడినైన నేను, నేనే సృష్టించిన నా ప్రకృతి పైన అధికారం వహించి నా మాయ వలన జన్మిస్తూ ఉంటాను.

ఈశ్వరుడికి లోబడిన వాళ్ళు సురులు. ఈశ్వరుడు ఉన్నాడని ఒప్పుకోని వాళ్ళు అసురులు. రాముడి దైవత్వం అంగీకరించని వాళ్ళు ఆధునిక కాలం లోనే కాదు, ఆ కావ్యం లోనే ఉన్నారు. తమ శక్తి ద్వారా తమ సుఖం పెంచుకోవాలి అనుకున్న వాళ్ళది అసుర ప్రవృత్తి, ఈ లోకంలో సుఖపడటం గురించి పట్టించుకోక, ఈ జన్మ మృత్యువుల చక్రం నుంచి తప్పించుకోవటమే ధర్మమూ, సుర ప్రవృత్తీ, అంటుంది భగవద్గీత.

దుర్యోధనుడు పుట్టుకతో మానవుడు, ప్రవృత్తి చేత అసురుడు. ఇదే విధంగా వామనావతారంలో బలి చక్రవర్తి కూడా ప్రవృత్తి చేత అసురుడే. బలి చక్రవర్తి ఇతరత్రా ధర్మాత్ముడే. కానీ ఈశ్వర తత్వాన్ని ఒప్పుకోలేదు. తన గురువైన శుక్రాచార్యుడు భిక్ష అడగ వచ్చిన వామనుడు విష్ణువని చెబితే లక్ష్మీదేవితో సరసాలాడే విష్ణువంతడివాడి చెయ్యి కిందయ్యింది. దానమిచ్చే నా చెయ్యి పైన అయ్యింది, ఈ రాజ్యాలూ శరీరాలూ శాశ్వతం కాదు, నా కీర్తే శాశ్వతం. దానమివ్వకుండా ఉంటానా? అంటాడు.

ఆదిన్ శ్రీసతి కొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై
బాదాబ్జమ్ములపై గపోలతటిపై బాలిండ్లపై నూత్న మ
ర్యాదన్ జెందు కరంబు క్రిందగుట మీదై నా కరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే!

ఈ అహంకారం విష్ణు పాదం తలను తాకే వరకూ పోలేదు. బలి చక్రవర్తిలో తరువాత మార్పు వచ్చింది. అందుకే మహావిష్ణువు పాతాళంలో బలి చక్రవర్తికి కాపలావాడుగా ఉండేవాడని ఇంకో కథ చెబుతోంది. ఒక సున్నితమైన సొగసు ఈ కింద శ్లోకంలో కనపడుతుంది.

విశ్వామిత్రాంతరంగాయ మిథిలా నగరీ పతే
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళం

బలి చక్రవర్తి లాగే జనక మహారాజు కూడా విష్ణువుకి దానమిచ్చిన భాగ్యశాలి, సీతను కన్యాదానం చేశాడు మరి. కానీ జనకుడు ఒక రాజర్షి. జ్ఞాని. జనకుడు కన్యాదానం చేయడం తన ఘనతగా భావించాడని అనడం అసమంజసంగా ఉంటుంది. అందుకే రాముడినే, మిథిలా నగరానికి రాజైన జనకుడు, కన్యాదానం చేయడం ద్వారా చేసుకున్న మహా పుణ్యంగా వర్ణిస్తుంది ఈ శ్లోకం. ఇదే మహాజ్ఞాని అయిన జనక మహారాజుకీ, అసురత్వం ప్రదర్శించిన బలి చక్రవర్తికీ తేడా.

అనేక మంచి గుణాలున్నవారు సైతం అసురులు అనబడతారని వామనావతారం చెబుతుంది. రావణుడివంటి వాళ్ళకి అసురులు, దైత్యులు, దానవులు, రాక్షసులు అని అనేక పేర్లు పెట్టారు. కానీ అసురత్వం వ్యక్తి యొక్క ప్రవృత్తి. సహజంగా ఆ ప్రవృత్తి కలవారంతా ఏకమవుతారు. నిశాచరులనీ, భయంకరమైన ఆకారం కలవారనీ, నరమాంస భక్షకులనీ అనేక చోట్ల వర్ణనలూ కనపడతాయి. కానీ రావణుడు నిశాచరుడు కాదు. పైపెచ్చు మొదటిసారి రావణుడిని చూసిన హనుమంతుడు అతని

తేజస్సు చూసి నివ్వెర పోతాడు. యజ్ఞాలు నాశనం చేయటమే వాళ్ళ పని కాదు. లంకలో తెల్లవారుజామున వాళ్ళు వేదాలు వల్లించడం హనుమంతుడు వింటాడు. రావణ వధానంతరం అతని మృతదేహానికి, వేదోక్త పద్ధతిలో అగ్ని సంస్కారం చేశారు. కానీ అసురందరినీ ఒక తల్లి సంతానంగా, ఒక జాతిగా వర్ణించిన కావ్యాలూ చాలా ఉన్నాయి

ఈ పరస్పర విరుద్ధమైన కథనాలకు ఒక ముఖ్య కారణం పైన వివరించినట్టు, రచించిన వారి భావ స్వాతంత్రం. రెండవ కారణం వేదాంతశాస్త్రం లోనూ ఆధ్యాత్మికత లోనూ వారి కున్న జ్ఞానమూ, ప్రతిభా. రామకథనే కనక ఉదాహరణగా తీసుకుంటే, రాముడు దేవుడని కావ్యాలు రాసినవారు సైతం, లక్ష్మణుడిని రాజనీతి తెలుసుకోటానికి రావణుడి వద్దకు రాముడు పంపాడనీ, రావణుడి కడుపు లోపల అమృత భాండం ఉంటే, ఆ విషయం విభీషణుడు రాముడికి చెప్పాడనీ రాసారు. ఇంకా దారుణంగా ఈశ్వరుడు కర్మ బంధానికి అతీతుడని మరిచిపోయి, రాముడు వాలిని చంపినందుకు బదులుగా, వాలి బోయవాడుగా జన్మించి కృష్ణుడిని చంపాడని కల్పించారు.

ఈ విధమైన కథలు జనం లో వ్యాపించడానికి కొంత కారణం సాంప్రదాయం. కొంత రచయితల, భక్తుల ప్రవర్తన. వ్యక్తిగతంగా మంచి వాళ్ళు అని పేరు పడ్డ వారి భావాలు ఇతరులు స్వీకరిస్తారు. మూఢ భక్తుల పట్ల గౌరవం, క్షుద్ర పూజలు చేసే కాపాలికుల పట్ల భయమూ ఇందుకే ఉంటాయి.

కానీ కథలన్నిటికీ ఒకటే గమ్యం, మానవులని అసుర ప్రవృత్తి నుంచి మళ్ళించడం. మనుషులను భయపెట్టినా అందుకే. బ్రతిమాలినా అందుకే. ఆశ చూపించినా అందుకే. స్వశక్తిని నమ్ముకున్న వాళ్ళను నిరసించినా అందుకే, మహనీయులను మార్గదర్శకులుగా చూపినా అందుకే. ఆ కథలు సంపూర్ణంగా

నిజమా? రచించిన వారి అలౌకిక అనుభూతా? కొంత నిజమా? అని ప్రశ్నించటం వృధా ప్రయాస.

రామావతారం లాగే మిగిలిన అవతారాలు ఈశ్వర తత్వాన్ని వివిధ కోణాల నుంచి దర్శిస్తాయి. అన్ని కథలూ దుష్ట-శిక్షణ శిష్ట-రక్షణ అనే మూసలో లేవు. కానీ సృష్టి అంతా భగవంతుని ఆధీనంలో ఉందని అనడానికి దృష్టాంతాలు చూపిస్తాయి. మత్స్యావతార కథలో ప్రళయం రావడం సృష్టి నియమం. నియమానుసారం నాశనమైన దాన్ని మళ్ళీ సృష్టించటానికి అవసరమైనవి జ్ఞానము (వేదాలు), ఋషులు, మనువు. కానీ వీటి సంరక్షణకు భగవంతుడి అవసరం ఉంటుందని అనటమే మత్స్యావతార కథ. దేవతలనూ మనుషులనూ వేరు చేసేది మృత్యువు. కానీ సముద్ర మధనం అయ్యేదాకా దేవతలు అమరులు కాలేదు. కూర్మావతార కథ భగవంతుని కృప లేకుండా దేవతలకు కూడా అమరత్వమూ, అస్థిత్వమూ లేవని చెప్పటమే. అదేవిధంగా మోహినీ రూపంలో ఉన్న విష్ణువు, అమృతం అసురులకి, ఈశ్వరుణ్ణి నమ్మని వారికి ఇవ్వడు. ఇక వరాహ అవతారంలో దుష్ట శిక్షణ జరిగింది. కానీ రక్షించినది భూమిని, అంటే భూమిలోని అందరినీ, మంచీ చెడూ అనే భేదం లేకుండా. భూమిని హిరణ్యాక్షుడు నీటిలో ముంచితే వరాహస్వామి వెలికి తీసే లోపల ఏమయ్యింది అని హేతువాద ప్రశ్నలు వెయ్యకుంటే ఒక భావాత్మక సమాధానం సాధ్యం. ఒకే ఒక్క అసురుడు, అనగా ఈశ్వరుడి మీద విశ్వాసం లేని వాడు, సకల సృష్టికీ కీడు చేయగలడు అనే భయమూ, ఆ పరిస్థితిలో కూడా భగవంతుడు సృష్టిని రక్షిస్తాడనే విశ్వాసమూ తెలుపుతోంది ఈ కథ.

నరసింహ అవతారానికీ రామావతారానికి ఒక చిన్న పోలిక ఉంది. రెండిటిలోనూ అసురులు చాలా దీర్ఘంగా ఆలోచించి, తమకు ఎదురు లేకుండా ఉండేందుకు వరాలు (శక్తులు) స్వశక్తితో సాధించుకుంటారు. వర నియమాలకి భంగం రాకుండా వాళ్ళని

నిర్మూలించాయి ఈ అవతారాలు. తేడా ఏమిటంటే నరసింహ అవతారంలో స్వామి స్తంభం నుంచి రావడం హిరణ్యకశిపుడిని సంహరించటం వెంట వెంటనే జరిగిపోతాయి. రావణ సంహారం ముందు చాలా రామ కథ ఉంది. ఆ తర్వాత కూడా పదకొండు వేల సంవత్సరాలు రాముడు రాజ్యం చేశాడు అని రామాయణం చెబుతోంది. వామనావతార కథలో బలి చక్రవర్తి మిగతా అన్ని విధాలా ధర్మాన్ని అనుసరించినా, అన్నిటిలోకీ అతి ముఖ్యమైన ఈశ్వరుడి సార్వభౌమత్వాన్ని ఒప్పుకోలేదని ముందరే మనం గుర్తించాము. కృష్ణావతారం ప్రత్యక్ష ఈశ్వరావతారం. వాల్మీకి రామాయణం ప్రకారం, రావణ వధ అనంతరం బ్రహ్మ రాముడు విష్ణువు అవతారమని స్తోత్రం చేస్తాడు. భాగవత కథలో బ్రహ్మ కృష్ణునితో పోటీపడి, ఓడి, చివరికి శరణు వేడతాడు. యముడు చనిపోయిన గురుపుత్రుని కృష్ణుడి ఆజ్ఞానుసారం బతికిస్తాడు. భారతంలో ద్రౌపది శరణు వేడిన తర్వాత మాత్రమే కృష్ణుడు తన దైవత్వాన్ని పాండవులని రక్షించటానికి ఉపయోగిస్తాడు. సుభద్ర పెళ్ళి విషయంలో కానీ, జరాసంధుడిని చంపడంలో కానీ ఖాండవ దహనంలో కానీ పాండవులకు శ్రీకృష్ణుడి సహకారం మాత్రమే ఉంది. దైవశక్తి లేదు. కృతజ్ఞతతో రాజసూయ యాగంలో పాండవులు కృష్ణుడికి ప్రథమ సత్కారం చేస్తారు. ద్రౌపది శరణు వేడిన తరువాత పాండవులు కృష్ణుని కృపకు పాత్రులయ్యారు. దూర్వాసుడి శాప భయం నుంచి వారిని రక్షించినా, పరీక్షిత్తుకు ప్రాణం పోసినా, అదే మూల కారణం. అన్నిటికీ అతీతమైనది యుద్ధంలో భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనులను వధించటానికి, తానే స్వయంగా పూనుకుని, పాండవులచేత రణధర్మాన్ని అతిక్రమింప చేయడం. శ్రీకృష్ణుడు పరమాత్ముడని చేతులెత్తేయగలం తప్ప దీనికి ఇంకేవిధంగానూ అర్థం చెప్పలేము. కూరత్తాళ్వారు అడిగిన ప్రశ్నలకంటే కూడా ఈ విధంగా రణధర్మాన్ని అతిక్రమింప చేయటం చాలా గొప్ప విచిత్రం. అవతారాలలో ఇటువంటి వైవిధ్యం గుర్తించే వారు మహావిష్ణువు ధరించిన ఈ అవతారలలో వర్ణించబడ్డ రూప శీల చేష్టలను సృష్టిలో ఇంక వేటితోనూ పోల్చలేము. దేవతలందరినీ

అన్నిటా మించిన ఈ అవతారాలను కేవలం పూజించగలము అంటారు.

అతి మానుష శీలవృత్తవేషైః అతివృత్తామర విక్రమప్రతాపైః
అతిలంఘిత సర్వలోక సామ్యం వరయే వైష్ణవ వైభవావతారం

ఇక్కడ ఇంకొక విషయం గుర్తించాలి. ధర్మాన్ని ఆచరించటం భౌతిక సుఖం కోసం అని ఎవ్వరూ, ఏనాడూ, ఎక్కడా చెప్పలేదు. ఎవరైనా సరే. ఆఖరికి ఈశ్వరుడే లేడన్న బుద్ధ భగవానుడు కూడా ధర్మం జన్మ సంసార బంధం నుంచి ముక్తి కోసమనే చెప్పాడు. మహాభారతంలో యుధిష్ఠరుడు అంపశయ్య మీద ఉన్న భీష్ముడిని అడుగుతాడు, అన్నింటినీ మించిన ధర్మమేది? దేని ద్వారా మనిషి జన్మ సంసార బంధం నించీ విముక్తి పొందగలడు అని.

కో ధర్మః స్సర్వ ధర్మాణాం భవత: పరమో మత:
కింజప న్ముచ్యతే జంతు ర్జన్మ సంసార భంధనాత్

దీనికి జవాబుగా భీష్ముడు పుండరీకాక్షుడైన శ్రీహరిని పూజించటం అర్చించటం అన్ని ధర్మాలలో ఉత్తమమైనవి అంటాడు.

ఏషమే సర్వధర్మాణాం ధర్మోధికతమో మత:
యద్భక్తా పుండరీకాక్షం స్తవైరర్చే న్నరస్సదా

దీనిని, అంటే భక్తి మార్గమే మిగతా అన్ని ధర్మ మార్గాలకంటే మించినది అని అంగీకరించినా, అంగీకరించకపోయినా, నాటి వారి దృష్టిలో ధర్మం కేవలం మోక్ష సాధనమే అన్నది నిర్వివాదం. వేదాలనాటి హరిశ్చంద్రుడు అపుత్రస్య గతిర్నాస్తి అని నమ్మి, కొడుకు పుడితేనే చాలునని, పుట్టినవాడిని బలి ఇవ్వటానికి కూడా ఒప్పుకుంటాడు. నిన్న కాక మొన్న దాకా

కూతురు విధవ అయ్యిందని జుట్టు తీయించి ఒంటిపూట మాత్రమే తిండి పెట్టారు తల్లితండ్రులు. వాళ్లు నరరూప పిశాచాలు కాదు. కేవలం అది ధర్మ మార్గమనీ, దాన్ని అనుసరించకపోతే ఇక పరలోకంలో సుఖం ఉండదనీ నమ్మిన వాళ్ళు. నేటి సమాజ పరిస్థితులలో, నేటి మానవతా విలువల సందర్భంలో ధర్మం ఏమిటన్నది వేరే విషయం. దీనినీ నా ఇతర రచనలలో చర్చించాను.

యజ్ఞ, యోగ, జ్ఞన, కర్మ మార్గాలలో సాధన చేసే వారికి ఈ కథలు అనవసరం. నిజమే. కానీ ఈశ్వరత్వం ఈ మార్గాలలో ధర్మాచరణ చేసే వారికి కూడా అవసరం అని భగవద్గీతలో స్పష్టంగా చెప్పారు. అన్నిటికంటే భక్తి మార్గమే ముఖ్యమనీ, తేలికనీ చెప్పటానికి ఇదే ముఖ్య కారణం. ఇతర ధర్మ మార్గాలలో సాధన చేసేవాడికి "నేను చేస్తున్నాను" అనే అసుర భావం నుంచి తప్పించుకోవటం కష్టం.

పైన ఉదాహరించినవి విష్ణు సహస్రనామ స్తోత్రం లోని శ్లోకాలు. స్తోత్రం చివర ఫలశృతిగా, మోక్షమే కాక సర్వ విధమైన సుఖాలు లభిస్తాయని కూడా ఉంటుంది. మరి పరమోత్కృష్టమైన మోక్షమే ఇవ్వగల స్తోత్రం ఈ మాత్రం తుచ్ఛ కామాలని తీర్చకపోతుందా అని కాబోలు. ఇవి అన్ని కథలకూ, స్తోత్రాలకూ, వ్రత పూజలకూ సమానమే. మొదలు పెట్టడం మోక్షానికి అని. ఫలశృతి లొ లౌకిక సుఖాలని కూడా కలుపుతారు.

రామో విగ్రహవాన్ ధర్మః అన్నా రావణుడు అధర్మపరుడన్నా ధర్మం మోక్షసాధనమనే దృష్టితోనే.

ముందు చూపిన విధంగా రామావతారమూ కృష్ణావతారమూ రెండు ధృవాలు. ఇద్దరూ విష్ణువు అవతారాలవటం మాత్రమే సమానం. రాముడిని మానవుడుగా భావిస్తూ కావ్యం రాయడం తేలిక. కృష్ణుడి దైవత్వం తొలిగిస్తే మిగిలేది శృంగారం మాత్రమే.

విచిత్రమేమిటంటే కృష్ణుడి శృంగారాన్ని చాలా మంది మహా భక్తులు దైవ పరంగా వర్ణించారు. దీనికే మధుర భక్తి అని పేరు. మరి శృంగార వర్ణన ఉన్న కావ్యం గానీ కవితగానీ కృష్ణుడి పేరు తగిలించి నంత మాత్రాన మధురభక్తి అవుతుందా? అవదు. మళ్ళీ రాసిన వారి ఆచరణ, జీవన విధానమూ, మార్గదర్శనం చేస్తాయి. తెలుగు సాహిత్యంలో కృష్ణ శృంగార వర్ణన చాలా విస్తృతంగా కనబడుతుంది. ఆ రచనలు చేసిన వారంతా భక్తులు కాదు. పదకవితా పితామహుడు అన్నమయ్యని క్షేత్రయ్యతో పోలిచి చూస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది. అన్నమయ్య మహా భక్తుడు. శృంగార సంకీర్తనలలోని వర్ణన క్షేత్రయ్య పదాల లాగే ఉంటుంది. కానీ అన్నమయ్య రాసిన అనేక ఆధ్యాత్మ కీర్తనలూ, బాలకృష్ణుడిపరంగా రాసిన కీర్తనలూ జోలపాటలూ మొదలైనవి చాలా ఉన్నాయి. అన్నమయ్య రాజుని పొగుడుతూ కీర్తనలను రాయ నిరాకరించి బందీఖానా పాలయ్యాడు. జీవితమంతా తిరుమల వేంకటేశ్వరునికి సేవ చేసాడు. అందుకే అతని శృంగార కీర్తనలు మధుర భక్తిలో భాగమని నమ్మటం తేలిక. కొంతమంది విద్వాంసులు క్షేత్రయ్య పదాలలో కూడా వేదాంతం వెతికి చూపించారు. కానీ నమ్మటం కష్టమౌతుంది. మువ్వగోపాల ముద్ర  పచ్చి శృంగారానికి ముసుగు మాత్రమే అనిపిస్తుంది. క్షేత్రయ్య జీవితమంతా రాజులనీ వేశ్యలనీ పొగడటానికే అంకితమయ్యింది మరి.

రామావతారానికీ కృష్ణావతారానికీ ఇంకొక తేడా చరమ శ్లోకాలలో కనపడుతుంది. ఈ చరమ శ్లోకాలు శ్రీవైష్ణవుల సాంప్రదాయం. ఇతరులు ఆ పేరుతో పిలవకపోయినా ఆ శ్లోకాల ప్రాముఖ్యత గుర్తించారు. శ్రీరామ చరమ శ్లోకం రామాయణం లోని "సకృదేవ ప్రపన్నాయ.." అన్నది.  శ్రీ కృష్ణ చరమశ్లోకం భగవద్గీత లోని

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

అన్నది. అన్ని ధర్మాలనూ (ధర్మ సందేహాలనూ) వదిలివేసి. నన్నొక్కడినీ శరణంటే, నిన్ను నేను అన్ని పాపాల నుంచీ విముక్తుడిని చేస్తాను. పాప భయం గురించి దుఃఖించవలసిన అవసరం నీకు ఉండదు అని దీని తాత్పర్యం.

రాముడు వైదికధర్మం ఆచరించాడు. శరణన్నవాడికి అభయం ఇస్తానన్నాడు. కానీ ఆ శరణన్నవాడికి ధర్మం ఏమిటో బోధించ లేదు, వాడి ధర్మాచరణ గురించి పట్టించుకోలేదు. కృష్ణుడు ధర్మాధర్మ చింత వదలి శరణన్నవాడికి పాప భయం లేకుండా చేస్తానన్నాడు. కానీ కృష్ణుడు భగవద్గీతలో తను చెప్పిందే ధర్మం అని కూడా అన్నాడు.

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః

అందుచేత నువ్వు అన్ని కాలాలలోనూ నన్నే స్మరిస్తూ యుద్ధం చెయ్యి. మనో బుద్ధులను నాకు సమర్పిస్తే నిస్సందేహంగా నీవు నన్నే పొందుతావు అంటుంది ఈ శ్లోకం..

ఇక్కడ అర్జునుడికి యుద్ధం చెయ్యి అని స్పష్టం చేశాడు. కృష్ణుడు. మాటిమాటికీ తన దైవత్వాన్ని ప్రదర్శించిన కృష్ణుడు మిగతా మానవులకి ఇంత స్పష్టంగా ఏం చెయ్యాలో చెప్పడు. నిస్సందేహంగా పరమాత్ముడి ఆజ్ఞ అని తెలియకుండా కర్తవ్యం నిర్ణయించుకోవాలి.

తన దైవత్వాన్ని గుప్తంగా ఉంచి, "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్", నాకు తెలిసినంతవరకూ నేను ఒక మనిషిని, ధశరథుడి కొడుకైన రాముడిని అన్న రాముడూ మనకి ఇది చెయ్యి అని నిర్దేశించడు. రాముడు ఇలా చేశాడు కనుక నేనూ అదే చేస్తాననే సాహసం ఎవరికీ ఉండదు. తైత్తిరీయ

ఉపనిషత్తు చెప్పినది సద్ర్పవర్తనగల మానవుడిని ఆదర్శంగా తీసుకోవాలని, అవతార పురుషులను కాదు.

చరమ శ్లోకాల ప్రసక్తి వచ్చిన తర్వాత వరాహ చరమ శ్లోకం కూడా స్మరించి తీరాలి.

స్థితి మనసి సుస్వస్థే శరీరే సతియో నరః
ధాతు సామ్యే స్థితే స్మార్తా విశ్వరూపం చ మామాజం
తతస్తం మ్రియమాణంతు కాష్ఠ పాషాణ సన్నిభం
అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్

ఆరోగ్యకరమైన శరీరం ఉన్నప్పుడు నేనే ఈ జగత్కారణమని ఎవరు నాకు శరణంటాడో, అవసాన దశలో, కదలలేని రాయిలా, కట్టెలా పడి ఉన్నా, నేనే వాడిని స్మరించి ముక్తి ప్రసాదిస్తాను అన్నారిక్కడ వరాహస్వామి.

ఈ విధమైన భక్తిని గౌరవించినా ఒక పెద్ద ప్రశ్న మిగిలిపోతుంది. గజేంద్రుడు అనేక వేల సంవత్సరాలు మొసలితో పోరాడి చివరికి "శరణార్థిని నన్ను కావవే" అన్నాడని చెబుతోంది భాగవతం. అంటే మొసలి పట్టుకోగానే శరణనటం సబబా? అలాంటప్పుడు శరణాగతికీ, గాలిలో దీపం పెట్టి దేవుడా నీ మహిమ అనటానికీ, తేడా ఏమిటి. పూర్తిగా స్వశక్తితో పోరాటం సాగించి, పోరాటంలో ఓడిపోయిన తర్వాతే శరణాగతి అనాలి, అనటమూ ఇబ్బందే. అలాంటి నిబంధనలేమీ చరమ శ్లోకాలలో చెప్పిలేవే? ఇది ఇలా ఉండగా ఆజామీళుడి సంగతేమిటి?

క్రూరాత్ముఁ డజామీళుఁడు
నారాయణ యనుచు నాత్మ నందును బిలువన్
ఏ రీతి నేలుకొంటివి
యేరీ నీసాటి వేల్పు లెందును కృష్ణా!

సరిగ్గా మరణించే ముందర అజామీళుడు నారాయణా అన్నాడు. అది కూడా దేవుడిని తలుచుకోవాలన్న ఉద్దేశంతో కాదు. అయినా అది మృత్యుముఖంలో అన్న మాట కనుక, ముక్తి లభించిందని ఆ భాగవత కథ చెబుతోంది. మరి ఈ పద్యం సంగతేమిటి?

చిలుక నొక రమణి ముద్దులు
చిలుకను శ్రీరామయనుచు శ్రీపతి పేరుం
బిలిచిన మోక్షము నిచ్చితి
వలరగ మిము దలఁచు జనులకరుదా కృష్ణా

ఇక్కడా దేవుని తలచుకోవాలనే ఆలోచనేమీ ఆ రమణికి లేదు. అయినా ఆ రమణికి కూడా ముక్తి లభించింది.

ఇది భగవంతుడి సార్వభౌమత్వానికి చిహ్నం. ఎటువంటి వారికైనా ముక్తినిచ్చే శక్తి కనక లేకపోతే భగవంతుడు సర్వశక్తిమంతుడు అనడం, అర్థం లేని మాట అవుతుంది. అటువంటి వారికి కూడా ముక్తినిచ్చాడు కనుక మన చిన్న చిన్న తప్పులు క్షమించబడతాయి, అనే స్థైర్యం ఈ కథలను చదివిన సామాన్యులకు కలుగుతుంది.

అందుకే తమ జీవితమంతా పరమ నికృష్టమైన పనులు చేసి, ఆఖరి క్షణంలో భగవంతుని కృపకు నోచుకున్నవారి కథలు, పురాణాలలోనే కాక, లెఖ్కలేనన్ని తెలుగు ప్రబంధాలలోనూ కావ్యాలలోనూ మొన్న మొన్నటి దాకా కనపడేవి. ఏ విధంగా భగవంతుని ఉనికిని గురించి గానీ, ప్రార్థన వల్ల కలిగే ఫలితం గురించి గానీ, రుజువులు వెతకటం ఆధ్యాత్మికంగా తప్పు అని నేను మనవి చేశానో, అదే విధంగా భగవంతుని కృపను ధర్మాచరణతో తూచడం కూడా తప్పు. ఈ విధమైన పరిమితి కేవలం భక్తి మార్గానికే కాదు అన్ని ధర్మమార్గాలకూ వర్తిస్తుంది.

అరయం శాంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలకునిపై నందవ్రజస్త్రీలపైఁ
బరఁగంగల్గు భవత్కృపారసము నాపైఁ గొంతరానిమ్ము మీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ హరి కృష్ణా దేవకీనందనా

అని ప్రార్థించినప్పుడు, కృప కొంత రానిమ్ము అనగలం గానీ, వారికంత ఇచ్చావు, నేనెక్కువ ధర్మాచరణ చేశాను, కనుక నాకు ఇంకొంచెం ఎక్కువ ఇవ్వమని వ్యాపారం చేయలేము.

అహోబిలే గారుడశైల మధ్యే
కృపావశాత్ కల్పిత సన్నిధానం
లక్ష్మ్యా సమాలంగిత వామభాగం
లక్ష్మీనృసింహం శరణం ప్రపద్యే

ఈ శ్లోకం భగవంతుని సార్వభౌమత్వానికీ కృపకూ కూడా చక్కటి నిర్వచనం ఇస్తోంది.  లక్ష్మీనృసింహ స్వామి, తన కృపకు తానే లోంగి, అహొబిలంలోని పెద్ద పెద్ద శిలల మధ్య భక్తులకు శరణమివ్వటానికి ఉండిపోయారు. ఇక్కడ కృప స్వామివారిదే. లోంగిపోయినదీ వారే.

పై శ్లోకంలాగే నాకు వ్యక్తిగతంగా చాలా నచ్చిన ఇంకొక ప్రార్థన కాళిదాసు రఘువంశం లోని ఈ మొదటి శ్లోకం

వాగర్థావివ సంపృక్తౌ  వాగర్థ ప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే   పార్వతీపరమేశ్వరౌ

మాట లేక అర్థం, అర్థం లేక మాట ఉండవు. అదే విధంగా సకల జగత్తుకీ తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులని విడివిడిగా భావించలేము, అంటారు కవికుల గురువు తనకు వాక్కు ఇమ్మని ప్రార్థిస్తూ.

పార్వతీ పరమేశ్వరులకి ఇంతకన్నా చక్కటి ఉపమానం ఉండదు, ఉండబోదు. పేరుకి వారిద్దరూ విడి విడిగా ఉన్నారు. నిజానికి వారిద్దరూ వేరు వేరుగా లేరు.

ఈ శ్లోకం లో గుప్తంగా ఇంకొక గొప్ప విషయం ఉంది. ఈ మాటకి అర్థం ఏమిటి అని అడగడం సర్వ సామాన్యం. కానీ ఆ అర్థమూ ఇంకో మాటే. దానికీ అర్థం ఏమిటని అడగవచ్చు. ఆ మాట ఏద్దైనా వస్తువు యొక్క పేరైతే ఆ వస్తువు చూపించవచ్చు. ఆ స్వానుభూతితో మాట అర్థమౌతుంది. అదేవిధంగా భగవంతుని గురించి ఎన్ని మాటలైనా చెప్పవచ్చు. కానీ ఆ మాటల అర్థాలు, స్వానుభూతి లేనప్పుడు, మాటలే అవుతాయి. ఈ విధంగా చూసినప్పుడు, ఈ శ్లోకమూ మొట్టమొదట ఉదాహరించిన భర్తృహరి "దిక్కాలాద్య.." అని మొదలైన శ్లోకమూ బింబ ప్రతిబింబాలని గ్రహించగలం.

ఈ వ్యాఖ్యానాన్ని ముగించే ముందు రామ కథాసుధ లోని సొగసులు మరోసారి.

పౌలస్త్యవధ కోసం జరిగినది రామ కథ. అందుకే తన కావ్యం రామాయణం, సీతా చరితం లేదా పౌలస్త్యవధ అన్నారు వాల్మీకి. ఈశ్వర నియంతత్వాన్ని ఒప్పుకోక పోవటమే దైత్య రాక్షస అసుర దానవ నిశాచర నామాలతో పిలవబడే వారి అసలు లక్షణం.

పరలోక సుఖ మోక్ష సాధనాలుగా ఈశ్వరుడు నిర్దేశించినవి తప యాగ యోగ కర్మలు. వీటితో తమ శక్తిని పెంచుకుని తామే సృష్టికి నియంతలు కావాలని ప్రయత్నం చెయ్యటమే రాక్షసత్వం. ఇంద్రుడు తన పదవికి కీడు రాకూడదని ఇతరుల తపస్సు భంగం చేయడానికి ప్రయత్నించాడంటాయి కొన్ని పురాణ కథలు. కానీ

ఇంద్రుడు సైతం ఈశ్వరుడికి లొంగి ఉండవలసినదే అంటాయి గోవర్ధనోద్ధారణ, పారిజాతాపహరణ కథలు. రాక్షసులు యజ్ఞాలని ధ్వంసం చేశారు, మునులని పీడించారు అని వర్ణిస్తున్న పురాణాలే రాక్షసులు తపస్సు చేసి శక్తులు సాధించారనీ చెపుతాయి. ఇతరులు కూడా శక్తులు సాధించి తమకు పోటీగా రాకుండా ఆపటం కోసమే ఈశ్వర విరోధులు మునులని హింసించటం యజ్ఞాలు ధ్వంసం చేసారనుకుంటేనే ఈ రెండిటికీ సమన్వయం సాధ్యం.

పురాణాలలో వర్ణించబడ్డ అందరు ఈశ్వర విరోధులలో అగ్రగణ్యుడు పౌలస్త్యుడే. అతి తెలివిగా భూమి మీదా ఆకాశంలోనూ, రాత్రింబగళ్ళలోనూ జీవమున్నవాటివల్లా జీవంలేని వాటివల్లా తనకి మృత్యువు ఉండకూడదు అని వరం పొందిన అసురుడు హిరణ్యకశిపుడిని చంపడానికి నరసింహావతారంలో విష్ణువుకి క్షణం పట్టలేదు.

భస్మాసురుడిని అంతం చేయడానికి ఎక్కువ కష్టపడాల్సిన అవసరం రాలేదు. భీముడికి తొడ చూపటం కుటిలుడైన దుర్యోధనుడిని చంపటానికి సరిపోయింది. రామాయణం పూర్తిగా జరిగిన తర్వాతే పౌలస్త్యవధ సంభవం అయింది. నర వానరుల వల్ల తప్ప ఇంకెవ్వరి చేతా తనకు చావు ఉండకూడదనే తెలివైన వరం పొందాడు పౌలస్త్యుడు.

పౌలస్త్యుడి కంటే ఎక్కువ శక్తి సామర్ధ్యాలను మానవుడు ఎలా సాధించగలడో చూపటానికి తన దైవత్వం వదిలి, తను నిర్దేశించిన ధర్మ మార్గాన్ని తానే ఆచరణలో పెట్టి పౌలస్త్యవధ చేయవలసి వచ్చింది. లీలా నాటక సూత్రధారికి లీలా నాటకంలో పాత్రధారి అవ్వాలిసి వచ్చింది.

గజేంద్రుణ్ణి రక్షించటానికి వెళుతున్న విష్ణువు వెనుక శంఖుచక్రాలు పరిగెత్తాయి అని భాగవతంలో వర్ణించారు పోతన గారు. రామ కథ జరగటానికి అవి నరరూపం స్వీకరించాయంటాయి కొన్ని కథలు.

స్వామికి ఎదురులేని సుదర్శన చక్రం వదిలి కోదండం స్వీకరించ వలసి వచ్చింది. పాల సముద్రం మీద శేష పానుపు వదలి కౌశికుడు పరచిన దర్భల మీద శయనించ వలసి వచ్చింది. కౌశికుడికి భృత్యుడిగా తండ్రి తనను పంపాడని చెబుతూ పితృవాక్య పాలనా ధర్మం ఆచరిస్తున్నాను కనుక స్త్రీ అవధ్య అయినా నీ ఆజ్ఞ ప్రకారం తాటకను చంపుతాను అంటారు స్వామి. తానే సృష్టించిన ధనుర్వేదం కౌశికుడి నుంచి ఆ ధర్మాచరణకు ప్రతిఫలంగా స్వీకరించ వలసి వచ్చింది.

తన లక్ష్మిని తాను స్వీకరించటానికి శివ ధనుస్సు విరిచి బాహుబలం చూపాల్సి వచ్చింది. పట్టు పీతాంబరాలూ మణి భూషణాలూ వదిలి జడలు ధరించి వల్కలతో పధ్నాలుగు సంవత్సరాలు గడపలిసి వచ్చింది. అరణ్యంలో మునులకి తన సౌందర్యం ప్రదర్శించి వాళ్ళ తపస్సు చెదరగా వారి కోసం గోపికాలోలుడుగా అవతారమే ఎత్తవలసి వచ్చింది. రాక్షసులని చంపుతానని మునులకి మాట ఇచ్చిన తరువాత కూడా తనంతట తాను యుద్ధం ప్రకటించలేదు. పది సంవత్సరాలకు పైగా ఋషి ఆశ్రమాలని దర్శించిన తర్వాత అగస్త్యుడి సలహా ప్రకారం పంచవటి చేరుకున్న తరువాత శూర్పణఖ తనంతట తాను వచ్చి సీతను చంపటానికి ప్రయత్నించటం శూర్పణఖ ముక్కు చెవులు కోయటానికి హేతువు అయింది. దానికి ప్రతిక్రియగా ఖర దూషణాదులు యుద్ధానికి వచ్చిన

తరువాత మాత్రమే రాక్షసుల వధ మొదలయింది. వివాహానికి ముందే సుబాహువుని చంపినా మారీచుడిని అడవిలోకి విసిరి తద్వారా మైథిలీ హరణానికి హేతువు సృష్టించి పౌలస్త్యవధ చేయవలసి వచ్చింది. నేను భూమిని చీల్చుకుంటూ వచ్చాను అని అనసూయకు స్పష్టం చేసిన సర్వైశ్వర్య ప్రదాయని స్వామి కట్టిన వల్కలకు దీటుగా ఏడాది పాటు మాసిన చిరుగు చీరతో గడపవలసి వచ్చింది. పౌలస్త్య వధ ముఖ్య ఉద్దేశ్యం కనుకనే రావణుడి కంటే బలశాలి, రావణుడి సఖుడు అయిన వాలికి సోదరుడి భార్యను స్వంతం చేసుకున్న నేరానికి శిక్ష విధించి, సుగ్రీవుడికి ప్రత్యుపకారం చేయవలసిన అవసరం ఏర్పరచి, హనుమాదుల సహాయం ధర్మబద్ధంగా తీసుకోవలసి వచ్చింది. ఇదంతా జరిగితే కానీ పౌలస్త్య వధ సాధ్యం కాలేదు. రావణుడి కంటే బలవంతుడిని సృష్టించడం వల్ల దేవతా వాంచ్ఛితమైన పౌలస్త్య వధ జరగలేదు. అటువంటి వాడు రావణుడి కంటే దురాత్ముడైయ్యే ప్రమాదం ఉండనే ఉంది. ఇదే వాలి కథ లోని అంతరార్థం.

నరావతారం స్వీకరించిన స్వామికి సహాయంగా వానర రూపాలతో పుత్రులని పంపమని సకల దేవతలకూ చతుర్ముఖ బ్రహ్మ చెప్పవలసి వచ్చింది. భృత్యుడు ఒకడు సహాయం చేయడానికి ముందుకు రాకపోవడం తో ముందు బతిమాలుకొని ఆ తర్వాత సముద్రుడిని బెదిరించాలిసిన అవసరం ఆ స్వామికే వచ్చింది.

సర్ప బంధాలతో ధరాశాయి అయి భృత్యుడు వచ్చి పాములని భయపెట్టి అవి భయంతో పారిపోయే దాకా ఏమీ చేయలేని వాడిలా ఉండిపోవలసి వచ్చింది. జానకిని వెతకటానికే కాక తన అంశయైన తమ్ముడి ప్రాణరక్షణకు

సైతం భృత్యుడి సహాయం కావలసి వచ్చింది. రావణ సంహారానికి ముందు అగస్త్యుడు వచ్చి ఆదిత్య హృదయం స్వామికి ఉపదేశించవలసి వచ్చింది.

ఇతరుల సహాయం తీసుకోవడం చాలనట్టు ఆప్త నారాయణుడు అక్కడే ఉండగా హనుమ లేకపోతే అందరూ లేనట్టే అని బ్రహ్మ పుత్రుడు చెబితే వినవలిసీ వచ్చింది.

నర ధర్మానుసారం కొడుకులని కని పితృ ఋణం తీర్చుకున్న తరువాత మాత్రమే అవతార పరిసమాప్తి సాధ్యం అయ్యింది. దీనిలో తన కర్తవ్యం నిర్వహించటానికే భూమి చీల్చుకుంటూ వచ్చిన దేవి లంకలోనే భూమిని చీల్చుకుంటూ నిష్క్రమించలేదని అనుకోవచ్చు. నరావతారం ధర్మావతారం కనుకనే అవతార పరిసమాప్తి కూడా యమధర్మరాజు వచ్చి చేయమని చెప్పిన తర్వాత జరిగింది. ధర్మాచరణే వరంగా పొందిన విభీషణుడు లంకలో చిరంజీవిగా ఉండిపోయాడు.

నాటక పాత్రధారణ రక్తి కట్టించటానికి కాబోలు కనకమృగాలు ఉండవని తెలియని మూఢుడిలా దాని వెనుక పరిగెత్తటం, సీత కనపడకపోతే, లక్ష్మణుడు పడిపోతే దీనంగా విలపించడం. సముద్రం దగ్గరకు వచ్చిన తరువాత కూడా సీతా వియోగం భరించలేక పోతున్నాని విలపించిన వ్యక్తే రావణ వధ తరువాత సీతతో నిన్ను ఈ పరిస్థితిలో స్వీకరించను అని చెప్పడం చేయవలసి వచ్చింది. భరతుడిని కలుసుకోవాలని ఆత్రుతతో పుష్పకం ఎక్కిన వ్యక్తి భరద్వాజ ఆశ్రమం చేరి ఇప్పుడు భరతుడు రాజ్యం కావాలనుకుంటున్నాడేమో తెలుసుకోమని హనుమంతుడిని పంపటం జరిగింది.

ఇలాంటి చిన్న చిన్న మెరుపులు కావ్యం లో ఇంకా చాలా ఉన్నాయి. ఇందుకే వాల్మీకి రామాయణాన్ని మొట్టమొదటి ద్వర్థి కావ్యం అనవచ్చు. రామకథను నర పరంగానూ దైవ పరంగానూ రెండు అర్థాలలో చదవవచ్చు. ఈ ద్వంద్వం సరిగ్గా అర్థం చేసుకోలేకపోవడం చాలా తేలిక.

ధర్మాన్ని ఆధారంగా చేసుకుని నరుడు దైవ సహాయంతో ఆ దేవతలు స్వయంగా చేయలేకపోయిన పౌలస్త్యవధ చేయగలిగినా రెండు ధర్మాల మధ్య ఎప్పుడూ ఉండే ఘర్షణ ఆ ధర్మావతారుడికీ తప్పలేదు. తాటక వాలి ల సంహారం లోనూ అంతకు మించి అగ్ని ప్రవేశం తరువాత దైవాదేశంగా స్వీకరించిన జానకిని రాజ ధర్మంగా తిరిగి వదిలి వేయటంలోనూ సామాన్యులకి ఇది ధర్మమా అనే ప్రశ్నలు తల ఎత్తక మానవు.

లక్ష్మణుడు ఇంద్రజిత్తుని చంపటానికి రాముడు ధర్మాత్ముడైతే ఈ బాణం అసురుణ్ణి సంహరించు గాక అంటాడు. ఆ విధంగా కేవలం రావణాదులని సంహరించటం అంటే అవతార ప్రయోజనం తీరటమే రాముడి ఆచరణ ధర్మమని సాక్ష్యం ఇస్తుంది.

మర్మగర్భంగా పరశురాముడూ ఇతర మహర్షులూ రాముడి దైవత్వాన్ని సూచిస్తారు. తరతరాలుగా ధర్మాత్ములైన రఘు వంశ రాజులు ఏలిన అయోధ్యా నగర ప్రజలు రామ వియోగం వల్ల అంత దుఃఖించడం, లౌకిక సుఖభోగాల లేమి వల్ల కాదు, ఈశ్వర వియోగం వల్ల. వారు దశరథుడి ఏలుబడిలో సకల సుఖాలు అనుభవిస్తున్న వారే. భరతుడు గుణవంతుడని తెలిసిన వారే. అవతార సమాప్తి సమయంలో వారందరికీ ముక్తి లభించడం ఈశ్వర సామీప్యం వల్లనే జరిగింది. పరబ్రహ్మ స్వరూపాన్ని తాము

స్వయంగా దర్శించుకున్నామని తెలుపటానికే సుతీక్ష్ణుడూ శరభంగుడూ స్పష్టంగా తమ తపః ఫలాన్ని స్వీకరించమని రాముణ్ణి అడుగుతారు. ఇంక ఏ పౌరాణిక కథ లోనూ ఇలా తపః ఫలాన్ని ఇంకొకరికి ఇస్తామనడం మనకి కనపడదు. మహాదాతలు సైతం తమ శరీరాలనీ ప్రాణాలనీ మాత్రమే ఇవ్వ చూపుతారు.

హనుమంతుడు రాముడి పరబ్రహ్మ తత్వాన్ని ఇంకా స్పష్టం చేశాడు. సన్యాసి వేషంలో రాముడిని సమీపించిన హనుమ సన్యాసి ధర్మాన్ని వదిలి ప్రథమ వీక్షణం లోనే రామునికి ప్రణిపాతం చేస్తాడు. రావణ సభలో రాముడు సకల లోకాలనీ భస్మం చేసి మళ్ళీ సృష్టించే శక్తి ఉన్నవాడు అని స్పష్టంగా చెబుతాడు.

నా మటుకు నేను కేవలం మానవుడినీ దశరథుడి కొడుకునీ అని స్వామి చెప్పటం అవతార ప్రయోజనం దృష్టిలో అవసరమే. కానీ జటాయువుకి మోక్షం, విభీషణుడికి శరణాగతి ప్రదానం చేస్తున్న సమయంలో శ్రీరాముడి మాటలే దైవత్వాన్ని స్పష్టం చేస్తున్నాయి.

తనదైన దైవశక్తులని సన్యసించి, తాను ఉపదేశించిన ధర్మాన్ని స్వయంగా ఆచరించి అవతార ప్రయోజనం సాధించడం వల్లనే ఆ త్యాగరాజు కోదండరాముడే పరబ్రహ్మమని పార్వతికి చెప్పారు.





ఈ వ్యాఖ్యానం పరమభాగవతుల జీవిత అనుభవాలకూ,
ఉపదేశాలకూ అనుగుణంగా ఉందనే భావిస్తున్నాను. పాఠకుల
అనుమోదానికి అదే కారణం కావాలి.

నా శ్రీవైష్ణవ సాంప్రదాయాన్నీ
చదివిన బహుకొద్ది ఆధ్యాత్మిక గ్రంథాలనీ
నా వైజ్ఞానిక శిక్షణనీ
సమన్వయ పరిచే ప్రయత్నమిది

గురుపరంపర లోని గొప్పవారందరూ
విజ్ఞతలేని ఈ రచనపై విసుగు చూపించక
మా ఇంటి పసివాడు మాటలాడాడని
ఆశీర్వదించి కరుణతో ఆదరించరయ్య

వందే శ్రీశైలపూర్ణార్యం పితామహ పితామహం
శ్రీమద్రామాయణార్థం యో భాష్యకృ న్మునయేవదత్

శ్రీ రామానుజ యోగి సున్దరవర శ్రీశైలనాథాన్ గురూన్
లోకార్యోత్తర వీధి కృష్ణ కలిజి ద్వేదాన్త భట్టారకాన్
శ్రీ గోవింద యతీంద్ర పూర్ణయమునా వాస్తవ్య రామానృజే
పద్మాక్షాహ్వయనాథయోగి శఠజిత్సేనేశ పద్మాహరీన్

**శ్రీ సీతాలక్ష్మణహనుమత్సమేత**
**రామచంద్రపరబ్రహ్మణే నమః**

